# దొంగతనం



---

ఆరి పసితనమా! మరచిపోదామన్నా మరపు రావటం లేదు. ఆ యిల్లుగాని పడిపోయినయిల్లు ఆ జారిపోయే కట్టుగుడ్డలు- నగ్న శరీరం, చెప్పులులేనికాళ్లు, పొలాలలో తిరగటం, మామిడి చెట్లెక్కటం- అన్ని విషయాలు కళ్లముందు తిరుగుతున్నయ్. ఆనాడు నాటురకం కిర్రుచెప్పులు తొడుక్కొంటూవున్నప్పుడు వుండే ఆనందం యీనాడు ఫ్లెక్స్ బూటు వేసుకునేప్పుడుగూడా రాదు. వేడి బెల్లం నక్కుళ్ల నీళ్లు త్రాగుతున్నప్పుడు కలిగిన ఆనందం యీ నాడు రోజ్ వాటర్ త్రాగుతున్నా రావటంలేదు. శనగపప్పు, పచ్చి రేగుపండ్లలో వుండే మాధుర్యం ద్రాక్ష, ఖీర్ మోహాన్ తింటున్నప్పుడుగూడా దొరకటంలేదు.

నేను నా పినతండ్రి కుమారునితోపాటు రెండోవూళ్లో వుండే బడికి మాల్వీగారి దగ్గర చదువుకోబోయేవాడిని. నా వయసు ఎనిమిది సంవత్సరాలు. హాల్ధర్ (అతడిప్పుడు స్వర్గంలో వున్నాడు) నా కంటె రెండు సంవత్సరాలు పెద్దవాడు. ఇద్దరం ఉదయమే చద్ది అన్నంతిని మధ్యాహ్నానికి జొన్న రొట్టెలు, బటాణీలు తీసుకొనిపోయేవాళ్లం. ఆ తరువాత రోజంతా మాదే. మాల్వీగారి దగ్గర హాజరు పట్టీ గూడాలేదు. గైరుహాజరయినందు వల్ల జుల్మానా కట్టాల్సిన పనీలేదు. ఇహా భయమెందుకు? అప్పుడప్పుడు పోలీసు ఠాణాముందునించొని పోలీసుల కసరత్తుచూస్తూ వుంటాము. మరొకప్పుడు కోతినో ఎలుగుబంటినో ఆడిస్తూ వచ్చే

తమాషా వాడితో రోజంతా తిరుగుతాము. ఎప్పుడయినా రైల్వేస్టేషను వైపు పోయి రైలుబండ్ల హడావుడి చూస్తాము. బండ్లరాకపోకలకు సంబంధించిన వివరాలు మాకు తెలిసినంతగా బహుశా రైల్వే టైమ్‌టేబిల్‌కుకూడా తెలిసియుండదు. దారిలో పట్టణంలోని మహాశయుడు ఒక పార్కును వేయించటం ప్రారంభించాడు. అక్కడ ఒక బాపిరాజువ్వతున్నారు. అదికూడా మాకొక గొప్ప సంతోషాన్నిచ్చే తమాషా. వాళ్లతో పోట్లాడి పోట్లాడి మేము వాళ్లపని చేస్తాము. ఒకచోట బక్కెటుతో మొక్కలకు నీళ్లుపోస్తే - మరొకచోట తొలికతో మొక్కలకు పాదులుచేస్తే - వేరొకచోట కత్తెరతో ఆకులు కత్తిరిస్తుంటారు. ఆ పనులలో ఎంత ఆనందం వున్నది! తోటమాలి బాల ప్రకృతి తెలిసిన పండితుడు. మాచేత పనిచేయించుకుంటాడు - మా మీద యేదో అజమాయిషీ చేసేవాడిలాగా దబాయించి పని చేయించే వాడిలాగ! అతడు రోజంతా కష్టపడి చేసేపని మేము గంటారెండు గంటలలోచేసి పారేసేవాళ్లం. ఇప్పుడాతోట మాలిలేడుగాని తోటమాత్రం పచ్చగానే వున్నది. తోట మీదుగా పోతున్నప్పుడు - ఆ చెట్లను కౌగలించుకొని యేడుస్తూ "ప్రియా! నీవు నన్ను మరచిపోయావుగాని నేను నిన్ను మరువలేదు. నీ జ్ఞాపకం నీ ఆకులెంత పచ్చగావున్నవో అంతపచ్చగా నాలోవున్నది. నిస్వార్థప్రేమకు నీవు నిదురిస్తూ మేలుకొనివున్న ఉదాహరణవు" అందామనిపిస్తుంది.

అప్పుడప్పుడు వారాల కొద్దిగా గైరుహాజరవుతూ వుంటాము. కానిమహ్వాలీగారికి ఎక్కినకోపమింతా చల్లగా దిగజారి

పోయేట్లు యేదో ఒకసాకు అల్లుకొని పోయేవాళ్లం. అంతటి కల్పనాశక్తి యీనాడుంటే ప్రజలంతా చకితులయి పోయేలాగా ఒక నవలవ్రాయగలిగి వుండేవాడిని. ఇప్పుడు ఎంత తలబాదుకొన్నా ఒక్క కథకూడా తోచదు. సరే! మామాల్వీగారుకుట్టుపనికూడా చేస్తారు. పండితులవుద్యోగం కేవలం తమాషాకోసరం చేస్తున్నారు. మేము అన్నదమ్ములమిద్దరం మావూళ్లోవున్న జనమందరితో ఆయన్ను వూరికే పొగిడేసేవాళ్లం. మమ్మల్ని మాల్వీగారి ట్రావెలింగు ఏజంట్లు అనికూడా అనవచ్చు. మా ప్రచారంవల్ల మాల్వీగారి కేదయినా పని దొరికితే మా సంతోషానికి మేరవుండదు. మాకు ఏసాకూదొరకని రోజున మాల్వీగారికి ఏదైనా ఒక బహుమానం తీసుకపోతాం. ఎప్పుడైనా శేరో అరశేరో శనక్కాయలు తీసుకపోయేవాళ్లం. మరొకప్పుడు పది పదిహేను చెఱుకులు, లేకపోతే జొన్నకంకులో గోధుమలో తీసుకపోయేవాళ్లం. ఈ బహుమతులను చూసేసరికి మాల్వీగారి కోపమంతా చల్లారిపోయేది. ఈ వస్తువుల పంట లేనప్పుడు అపాయాన్నుంచి తప్పించుకోటానికి ఏదో ఒక ఉపాయం ఆలోచించేవాళ్లం. మాల్వీగారికి పిట్టలంటే మహాసరదా. వరండాలో కోయిల, గోరంకి, మొదలయిన పక్షుల పంజరాలు వ్రాగులాడుతూవుండేవి. మాకు పాఠం జ్ఞాపకంవున్నా లేకపోయినా ఈ పక్షులుమాత్రం తప్పకుండా జ్ఞాపకముండేవి. మాతోపాటుఅవి కూడా చదువుతూవుండేవి. ఈ పిట్టలకోసం పిండిపిసికేప్పుడు మేము చాలా వుత్సాహంగా వుండేవాళ్లం. మాల్వీగారు పిల్లలందరూ మిడుతల్ని పట్టుకరావాలని తాకీదు యిస్తూవుండేవారు. ఈ

పిట్టలకు మిడుతలంటే మహారుచి. అప్పుడప్పుడు మా ప్రమాదం మిడుతల నెత్తి మీదుగా దాటిపోతూ వుండేది. వాటి బలి దానంతో మేము మాల్వీగారి రౌద్రరూపాన్ని ప్రసన్నం చేసుకొంటూ వుండేవాళ్లం.

ఒకరోజు ఉదయమే మేమిద్దరు అన్నదమ్ములం చెరువులో ముఖం కడుక్కోబోయాము. హాల్ ధర్ యేదో తెల్లటివస్తువును గుప్పిడిలో పెట్టుకొని చూపించాడు. నేను టకీమని గుప్పిడి తెరిస్తే అందులో ఒక రూపాయివున్నది. ఆశ్చర్యముతో "ఈ రూపాయి ఎక్కడదొరికింది" అన్నాను.

హాల్ ధర్:_అమ్మ చెక్కమీద పెట్టింది. మంచం నిలవేసి తీసికొచ్చాను.

ఇంట్లో పెట్టెలు, అలమార్లులేవు. రూపాయలు, చిల్లర డబ్బులు ఎత్తయిన చెక్కమీద పెట్టుతూ వుండేవాళ్లు. ఒక రోజు చిన్నాయన బంగారం అమ్మాడు. ఆ డబ్బే జమీందారుకు ఇచ్చేందుకు పెట్టిపెట్టారు. హాల్ ధర్ కు ఎట్లా తెలిసిపోయిందో, ఇంట్లోవాళ్లంతా పనిలోవున్నప్పుడు తను మంచం నిలబెట్టి దాని మీదుగా ఎక్కి ఒకరూపాయి తీసుకొచ్చాడు.

ఆసమయంవరకు మేమురూపాయిని తాకనైనా తాక లేదు. ఆరూపాయినిచూచి మాలోజనించిన ఆనందంతో కూడినభయతరంగాలు ఈరోజువరకూ జ్ఞాపకమున్నయ్. మాకు సంబంధించి రూపాయి దొరకని వస్తువ. మాల్వీగారికి మావద్ద

నుండి ఒక ముప్పావలా మాత్రమేముట్టేది. నెలచివరిరోజున చిన్నాయన స్వయంగాపోయి డబ్బు యిచ్చి వచ్చేవాడు. మేమంటే అంత మాత్రం నమ్మకంకూడా లేదు. అటువంటి మేమే యీ రోజున ఒక్కరూపాయికి సర్వాధికారంగల చక్రవర్తులం. మాగర్వాన్ని ఎవరు అంచనా వేయగలరు? కాని దెబ్బలు తగులుతాయనే భయం మా ఆనందానికి అడ్డుపడు తున్నది. రూపాయలు లెక్కపెట్టకుండాపెట్టనవిగాదు. దొంగతనం బయటపడుతుందనేది తెలిసిన విషయమే. చిన్నాయన కోపంయొక్క ప్రభావపు అనుభవం నాకు కాలేదు కాని హాల్ధర్కు మాత్రం జరిగింది. ఆయనకంటే మంచిమనిషి ప్రపంచంలో ఎవరూ లేరు. మా చిన్నమ్మ ఆయన రక్షణభారాన్ని నెత్తినబెట్టుకోక పోతే ఏదో ఒకవడ్డీ బేరస్థుడు బజారులో ఆయన్ను అమ్మ గల్గివుండేవాడు. కోపంవస్తే ఆయనకేమీ తెలియదు. చిన్నమ్మ కూడా ఆయనకోపాన్ని ఎదుర్కోవటానికి భయపడుతుంది. మేమిద్దరం ఎన్నోనిమిషాలపాటు యీ ఆలోచనలతోనే గడిపి చివరకు వచ్చిన లక్ష్మిని పోగొట్టుకో గూడదనే నిశ్చ యానికి వచ్చాము. మొదలసలు మామీద సందేహమే రాదు. ఒకవేళవస్తే గట్టిగా మాకు తెలియదని చెప్పేస్తాం— "రూపాయి తీసుకొని ఏంచేసుకొంటాము? మాఖాళీ జేబులుచూచుకోండి అంటాము," బహుశ నిదానంగా ఆలోచిస్తే యీ నిశ్చయం మారిపోయి ముందు జరుగ బోయే భీభత్స దృశ్యం జరగ కుండా వుండేది. కాని ఆ సమయంలో అంతటి ఓర్పులేకపోయింది.

ముఖము - కాళ్లు కడుక్కొని ఇంటికి వెళ్లాము. భయ పడుతూ భయపడుతూలోపల అడుగుబెట్టాము. ఇప్పుడు గనక సోదా చేయటం ప్రారంభమయితే భగవంతుడే రక్షకుడు. అందరూ తమ తమ పనులు చేసుకుంటూ వున్నారు. ఎవరూ మాతో మాట్లాడలేదు. మేము చద్దిఅన్నం గూడా తినలేదు. శనగ గింజలుగూడా తీసుకోలేదు. పుస్తకాలు చంకలో పెట్టు కొని బడిమార్గం పట్టాము.

వర్షాకాలపు రోజులు. ఆకాశంలో మబ్బులు అల్లుకొని వున్నయ్. ఇద్దరం లోలోన సంతోషిస్తూ స్కూలుకు పోతు న్నాము. ఈరోజున కౌన్సిల్ లో మినిస్టరయినా అంతటిసంతోష ముండదు. వేలకొద్దిలడ్డుండలు నోట్లోతిరుగుతున్నయ్! వేలకొద్ది గాలిమేడలు కడుతున్నాం. ఈ అవకాశం ఎంతో అదృష్టంచేత దొరికింది. జీవితంలో బహుశా ఇటువంటి అవకాశం మరలా దొరక్కపోవచ్చు. అందువల్ల యీ రూపాయిని వీలయినన్ని ఎక్కువదినాలువాడుకోవాలని నిర్ణయించుకున్నాము. ఆరో జుల్లో ఒకసేరుమంచి మిఠాయి ఒకరూపాయికి దొరికేది. మే మిద్దరం అర్ధశేరుతినే సరికే శోషపోతాము. అయినా మిఠాయి కొంటే రూపాయి ఒక్కరోజులోనే అయిపోతుందని అను కున్నాము. యేదయినా చవుకగావచ్చే - రుచిగావుండేది - కడుపు నిండేది - వస్తువునుచూచి కొందామను కున్నాము. చివరకు ముంతఖర్జూరం మీద మనసుపోయింది. ఇద్దరం యిష్ట పడ్డాము. అర్ధణాఖర్జూరం కొన్నాము. చాలాచవుక రోజులు అర్ధణాకు పెద్దపెద్దవి పన్నెండువచ్చినయ్. మాయిద్దరి చొక్కా

ఒళ్ళుసిండిపోయినయ్. ముంతఖర్జూరంవాడి చేతిలో హాల్ ధర్ రూపాయిపెట్టాడు. వాడుసందేహంతో చూస్తూ "యేం ఎక్కడ సంపాయించారు ? దొంగిలించితేలేదుగదా?" అన్నాడు.

సమాధానం మాదగ్గర తయారుగానేవున్నది. ఎక్కువగా కాకపోయినా రెండు మూడుపుస్తకాలయినా చదివాముగా! చదువు ప్రభావం కొద్దికొద్దిగా మామీదపడుతున్నది. నేను వెంటనే "మౌల్వీగారికి జీతంకట్టాలి.ఇంట్లో చిల్లరలేక చిన్నాయన రూపాయిచ్చాడు." అన్నాను.

ఈ సమాధానంవాడి సందేహాన్ని దూరంచేసింది. ఇద్దరం ఒక వంతెన మీదకూర్చొని ఖర్జూరాలుతినటం ప్రారంభించాము. అయితే యీ పదిహేనణాలన్నర ఎక్కడికి తీసుకపోతాము ! ఒకరూపాయిదాచి పెట్టటం యింతకష్టమయిన పనిగాదు. చిల్లర డబ్బుల గందరగోళం ఎక్కడ దాగుతుంది ? బొడ్లో పెట్టుకోను కావలసినచోటులేదు. జేబులో యింతమోత భరించలేము. ఆచిల్లర డబ్బులు మాదగ్గర పెట్టుకోటమంటే మా దొంగ తనాన్ని గూర్చిదండోరా వేసు కోటమన్నమాట. ఎంతో ఆలోచించిన తరువాత పన్నెండణాలు మౌల్వీగారి కిచ్చి - మిగతామూడణాలన్నరతో మిఠాయికొనేద్దామని - తీర్మా నించుకున్నాము. ఈ నిశ్చయంతో మేము బడిచేరుకున్నాము. ఎన్నోరోజులతర్వాత యీ రోజు బడికి పోవటం. మౌల్వీగారు కోపంతో అడిగారు "ఇన్నిరోజులు ఎక్కడ మాయమయి నార్రా?" నేను "మౌల్వీగారూ! మాయింట్లో చావు జరిగిం దండీ!" అన్నాను.

ఈ మాటలు అంటూఅంటూనే పన్నెండణాలు ఆయన ముందుంచాము. మళ్లా యేమడుగుతారు! డబ్బు చూడగానే మాల్వీగారి చర్మంముడతలు విడిచిపోనయియ్. నెలకావటానికి యింకా ఎన్నో రోజులుంది. ప్రతిసారీ నెలదాటిపోయి ఎన్నో రోజులయినాక, ఎన్నోసార్లు వార్నింగు లిచ్చిన తరువాత, నెల జీతం ముట్టేదికాదు. యీసారి యింతముందుగా జీతంవచ్చి నందుకు ఆయన సంతోషించటం యేమీ అసాధారణంగాదు. మేము యితలరువంక సగర్వంగా - అడిగినాగాని యివ్వకుండా వుండే మీరున్నారు అడక్కుండానేయిచ్చే మేమున్నాము. అహా! హా! చూడండి - అన్నట్లుగా చూస్తున్నాము.

మేము పాఠం చదువుతుండగానే -మధ్యాహ్నంనుండి శలవు - చెర్లో తెప్పతిరుణాళ్ల జరుగుతుంది గాబట్టి - అనే సమాచారం మాచెవుల్లో పడ్డది. మాల్వీగారు తిణాళ్లలో బుల్ బుల్ పిట్టల పందాలకు పోతారు. ఈ వార్త వినటంతోనే మాలో సంతోషానికి తావులేకుండా పోయింది. పన్నెండణాలు ఎటుదిరికీ బాంకులో జమచేశాము. తిరునాళ్ల చూడటానికి యింకా మూడణాలన్నర మిగిలింది. ఎంతో బాగుంటుంది. అప్పాలు, లడ్లూ, తింటుంటే మహామజాగా వుంటుంది. వుయ్యాల ఎక్కుతాము. అంతాఅయిపోయిం తరువాత సాయంత్రానికి యిల్లు చేరుకుంటాము. -ంతాబాగానేవుంది గాని మాల్వీగారు ఒక చెడ్డషరతు బెట్టారు - మధ్యాహ్నం శలవుకుముందుగా పిల్ల లందరూ తమ తమ పాఠాలు ఒప్పజెప్పాలి. అట్లా ఒప్పజెప్పని వాళ్లకు శలవు వుండదు - అన్నాడు. ఫలస్వరూపంగా నాకయితే

విముక్తి కలిగిందిగాని హాల్‌ధర్ మాత్రం ఖైదీ అయినాడు. ఇంకా ఎంతోమంది పిల్లలు పాఠాలు ఒప్పజెప్పారు. అందరూ ఉత్సవానికి బయలుదేరారు. నేనూ వాళ్ల వెంట బయలుదేరాను. డబ్బు నాదగ్గరనే వున్నది. అందువల్ల హాల్‌ధర్‌ను నావెంట తీసుకపోను వేచియుండలేదు. శలవు దొరకగానే హాల్‌ధర్ ఉత్సవానికొచ్చేట్లు అక్కడ యిద్దరమూ కలసి తమాషా చూచేట్లుగా ముందుగానే నిశ్చయించుకొన్నాము. అతడు వచ్చేంతవరకు డబ్బులు ఖర్చు చేయనని మాటగూడా యిచ్చాను. మా దౌర్భాగ్యం వేరే లీలను రచిస్తున్నదని మాకేం, తెలుస్తుంది? నేను ఉత్సవం దగ్గరకుపోయి ఒకగంట జరిగిపోయింది కాని హాల్‌ధర్ చిరునామా ఎక్కడా కనిపించలేదు. ఇంతవరకూ మాల్వీగారు శలవు యివ్వలేదా? లేకపోతే దారి తప్పిపోయాడా? కళ్లు పెద్దవి- మరింత పెద్దవిచేసుకొని దారిని చూచాను. ఒంటరిగా ఉత్సవంచూడటానికి మనసవటం లేదు. దొంగతనం యెక్కడయినా బట్టబయలయి పోయిందేమో ననే సందేహం కూడా అప్పుడప్పుడు కలిగింది - చిన్నాయన హాల్‌ధర్‌ను ఇంటికి లాక్కుపోయాడా? చివరకు సాయంకాలానికి నేను కాసినినూజీడీలు కొనుక్కొని హాల్‌ధర్ భాగండబ్బులు జేబులో వేసుకొని - తింటూ ఇంటిదారి బట్టాను నెమ్మదిగా. దారిలో హాల్‌ధర్ వుంటాడేమో బడి మీదుగా పోదామనిపించింది. అక్కడ నిశ్శబ్దంగా వున్నది. ఆః! అక్కడ ఒక ఆడుకొనే పిల్లవాడు దొరికాడు. వాడు నన్ను చూస్తూనే కేరింతలు కొడుతూ "బ్రతికిపోయావు. ఇంటికిపో ఎట్లాంటితన్నులు తగుల్తయ్యో తెలుస్తుంది. మీచిన్నాయన

వచ్చాడు. హాల్‌ధర్‌ను బాదుతూ బాదుతూ లాక్కుపోయాడు. అబ్బా! ఎంతగట్టిగా కొట్టాడనుకున్నావు? ఒక తాపుతో హాల్‌ధర్ బోర్లబొక్కల పడిపోయాడు. ఇక్కడనుండి యీడ్చుకొని పోయాడు. మీరు మాల్వీగారికిచ్చిన; జీతండబ్బులుగూడా తీసుకు పోయాడు. ఇప్పుడే యేదో ఒకనాడు ఊహించుకో. లేకపోతే మహాబరువయిన దెబ్బలు పడుతయ్. వీపుచినిగి పోతుంది అన్నాడు.

నా స్మృతి తప్పిపోయింది. యేది జరుగుతుందనుకున్నానో అదే జరిగింది. కాళ్లు వణుగు - వణుగు బరువెక్కినయ్ ఇంటి వంకన ఒక్కొక్క అడుగువేయుటం గూడా కష్టమయిపోయింది ఎంతమంది దేవుళ్ళు - దేవతలపేర్లు జ్ఞాపకమున్నవో అందరికీ మొక్కుకుంటూ ప్రార్థనలుచేస్తూ_దండకాలు చదువుతూ కాలు కదిలిస్తున్నాను. కొందరికి లడ్లు _ కొందరికి దూధ్‌పేడా_మరి కొందరికి బత్తాయిలు_యిస్తానని మాటయిచ్చాను. వూరి పొలి మేరలలోకి రాగానే గ్రామదేవతను స్మరించుకొన్నాను. మా ఇలాకాలో అన్ని దేవుళ్ళకంటే గ్రామదేవతే సర్వ ప్రధానంగా వుండేది.

ఇవన్నీ చేసి నాయిల్లుదగ్గర పడుతున్న కొద్దీ గుండె కొట్టు కొనేవేగం ఎక్కువయి పోతున్నది. మేఘాలు కమ్ముకొంటున్నయ్. ఆకాశంనుండి కుండపోతగా వర్షంపడుతున్నట్లుగా అనిపిస్తున్నది. జనమంతా తమతమ పనులన్నిటినీ వదలివేసి పారిపోతున్నట్లుగా కనిపిస్తున్నది. ఆవులు తోకలెత్తుకొని ఇండ్లకు గంతులేస్తూ

పోతున్నట్లుగావున్నది. పక్షులు తమగూళ్ళకుచేరుతున్నట్లుగావుంది. కాని నేను అదే మందగమనంతో కాళ్ళల్లోశక్తి లేనట్లుగా నడిచి పోతున్నాను. తీవ్రంగా జ్వరమువచ్చినా—ఎక్కడయినా గాయం తగిలినా—బాగుండుననిపిస్తున్నది. చెప్పినంతమాత్రంచేతనే చాకలి వాడు గాడిదనెక్కడు. పిలుస్తే చావుగూడారాదు. జబ్బుమాట వేరేచెప్పాలా! యేమీరాలేదు. నెమ్మదిగా అడుగులో అడుగేస్తూ నడిచినా ఇల్లు దగ్గరకు రానేవచ్చింది. ఇప్పుడు నాగతేంకాను? మా ఇంటిముందు ఒక పెద్దచింతచెట్టున్నది. దాన్ని అడ్డంగా చేసుకొని కొంతచీకటిపడేవరకు దాక్కుంటే చీకటిలోదూరిపోయి అమ్మమంచంకిందికిపోయి కూచోవచ్చు. అందరూ నిద్రపోయిం తరువాత కథంతా సవిస్తరంగాచెప్పవచ్చు, అమ్మ ఎప్పుడూ కొట్టనేకొట్టదు. ఆమెముందు దొంగేడుపుయేడుస్తూ కూచుంటే కరిగిపోతుంది. రాత్రి జరిగిపోయింతరువాత ఎవరడుగుతారు? ఉదయం లేచేసరికి కోపంచాల్లారిపోతుంది. ఈ ఊహాలన్నీ ఫలిస్తే నేను చెక్కుచెదరకుండా బ్రతికిపోతాను. అయితే భగవంతుడు మరొకటితలచివున్నాడు! నన్ను ఒక పిల్లవాడుచూచి నాపేరు పెద్దగాపిలుస్తూ ఇంట్లోకి పరుగెత్తాడు. దీంతో నా ఆశలన్నీ అడియాసలయినయ్. దిక్కుతోచక ఇంట్లోకాలుపెడుతూ పెడుతూ వుండగానే నానోట్లోనుంచి ఒక పెద్దఅరుపు బయటపడ్డది. దెబ్బ తిన్నకుక్క తనవంకకు వచ్చేవారిని చూచి అరిచేట్లు—అరిచాను. వసారాలో నాన్నగారు కూచోనివున్నారు. నాన్నగారి ఆరోగ్యం యీామధ్య కొద్దిగా దెబ్బతిన్నది. శలవుమీాద ఇంటికొచ్చారు. ఆయన యేమంటారో నాకుతెలియదు. కాని ఆయన వేరుశనగ

పప్పుతింటూవున్నారు. సాయంకాలంపూట ఒక సీసాలోని మందును మరొకగ్లాసులోపోసుకొని గుటగుట త్రాగుతున్నాడు. బహుశా యిదియే బాగాచదివిన వైద్యుడో సిఫారసు చేసిన మందయివుంటుంది. మందులన్నీ వాసన గొడుతూ - చేదుగా వుంటయ్. ఇదిగూడా అటువంటిమందే. అయినా నాన్నగారు దానిని అంత ఉత్సాహముతో ఎందుకు త్రాగుతున్నారో నాకర్థం కావటంలేదు. మనం మందు త్రాగితే నోట్లోపోసుకోగానే కళ్లు మూసుకొని ఒక్కగుటకలో మింగేస్తాము. బహుశా యీ మందుప్రభావం నెమ్మదిగా నెమ్మదిగా మింగితేగాని కలుగదేమో. నాన్నగారి దగ్గర సమీపగ్రామంలోని యిద్దరు ముగ్గురు - అప్పు డప్పుడు నలుగురైదుగురు రోగులు చేరుతుంటారు. గంటల తరబడి మందుత్రాగుతూనే వుంటారు. భోజనం చేసేందుకు బహుకష్టంమీదగాని లేవరు. ఇప్పుడుగూడా వాళ్ళుమందు త్రాగుతున్నారు. రోగుల సమాజం హాజరయే వున్నది. నన్ను చూస్తూనే నాన్నగారు కళ్లెర్రజేసి "ఇంతవరకు ఎక్కడున్నావు?" అని పెద్దగా అడిగారు. నేను గద్గదస్వరంతో "ఎక్కడాలేను" అని సమాధానమిచ్చాను. "ఇప్పుడు దొంగవిద్య నేర్చుకుంటు న్నావా? చెప్పు నువ్వు రూపాయి దొంగిలించావా లేదా?"

నా నాలుక ఆగిపోయింది నాముందు తెల్లటి ఖడ్గం నాట్యమాడుతున్నది. శబ్దంచేయను గూడాభయమవుతూవున్నది. నాన్నగారు గట్టిగాదబాయిస్తూ అడిగారు "మాట్లాడవేం? నువ్వు రూపాయిదొంగిలించావా? లేదా?" నేను ప్రాణంమీద ఆశవదిలి అన్నాను. "నేను..............."

నోట్లోంచి మాటకూడా పెగిలిరాలేదు. నాన్నగారు వికృతరూప ధారణచేశారు. పళ్ళుకొరుకుతూ ఠకీమని లేచారు. చేయెత్తి నావంకకు దూకారు. నేను పెద్దగాయేడవటం ప్రారంభించాను. నాఅరుపులకు నాన్నగారుకూడా భయపడిపోయారు. ఆయనచెయ్యి ఎత్తులోనేవుండిపోయింది. ఇప్పుడే యీవిధంగా వున్నది, దెబ్బతగలగానే పీడప్రాణం కాస్తా ఎగిరిపోతుందని అనుకొనివుంటారు. నానేర్పరితనం, తెలివితేటలు ఫలితాన్ని పొందటం గ్రహించి మరింత గట్టిగట్టిగా యేడవటం మొదలుపెట్టాను. ఇంతలో రోగుల సమాజంలోని యిద్దరుముగ్గురు సభ్యులు నాన్నగారిని పట్టుకొని, నన్నుపారిపొమ్మని సంజ్ఞ చేశారు. పిల్లలు యిటువంటి సమయాలలో యింకా మందకొడిగానే వుండి ఎక్కువగా దెబ్బలు తింటారు. నేను ఎంతో తెలివిగా వ్యవహరించాను.

లోపలిదృశ్యం ఇంతకంటె భయంకరంగావున్నది. నా రక్తంచల్లబడిపోయింది. హాల్ధర్ రెండు చేతులూ ఒక స్తంభానికి కట్టేశారు. ఒళ్ళంతా దుమ్ముగొట్టుకొనిపోయింది. వాడు యింకా ఎక్కిళ్ళుపెడుతూనేవున్నాడు. బహుశా నా ఇంటినిండా పడి దొర్లివుంటాడు. ఇల్లంతావాడి కన్నీటితో తడిసిపోయినట్లుగా అనిపించింది. చిన్నమ్మ హాల్ధర్ను తిడుతున్నది. అమ్మ కూచొని మసాలాకలుపుతున్నది. ముందుగా చిన్నమ్మచూపు నామీదపడ్డది. "అదిగో! వాడుకూడావచ్చాడు. యేరా? రూపాయి నువ్వుదొంగిలించావా? వీడు దొంగిలించాడా?" అని అడిగింది. నేను అనుమానంలేకుండా ఖచ్చితంగా చెప్పేశాను.

"హాల్ ధర్" అమ్మ వాడు దొంగతనంచేస్తే ఇంటికొచ్చి నువ్వెందుకు చెప్పలేదు ? అన్నది.

ఇహ అబద్ధం చెప్పకుండా బ్రతకటంకష్టం. మనిషికి ప్రాణంమీదకు వచ్చినప్పుడు అబద్ధంచెప్పినందువల్ల పాపంవుండదని నా అభిప్రాయం. ఎటుతిరిగీ హాల్ ధర్ కొన్ని దెబ్బలు తినే వున్నాడు. మరి రెండుమూడు గుద్దులుపడినా చెడిపోయేదేమీ లేదు. నేనెప్పుడూ దెబ్బలుతినిఎరుగను. మూడు నాలుగు గుద్దులతోనే నాప్రాణం ఎగిరిపోతుంది. హాల్ ధర్ గూడా తన్ను రక్షించుకోటానికి నామీద యేవో నేరాలుమోపివుంటాడు. లేకపోతే చిన్నమ్మ నన్నెందుకడుగుతుంది ? "రూపాయి నువ్వు దొంగిలించావా ? హాల్ ధర్ దొంగిలించాడా ?" అనెందు కంటుంది ? యే సిద్ధాంతం ప్రకారంచూచినా యీ క్షణంలో నేను అబద్ధం చెప్పటం క్షమించదగ్గదే. పోగ డ్తకు అర్వాంకాకపోతే కాక పోవచ్చు. నేను వెంటనే "ఎవరితోనయినా చెబితే ప్రాణం తీసేస్తానన్నాడు." అన్నాను.

అమ్మ:_ చూచావా ! అదే జరిగింది నాపిల్లవాడిలో అట్లాంటి లక్షణాలే లేవని నే చెప్పలే? డబ్బులుచేత్తోతాకను గూడతాకడు. అందరూ నన్నే పనికిరానిదానినిగా చేశారు?

హాల్ ధర్:_ "చెప్పితే చంపేస్తానని ఎప్పుడన్నానమ్మా నీతో?"

నేను:_ "అక్కడే! చెరువుగట్టుమీద అనలే?"

హాల్ ధర్:— "అమ్మా! వాడుచెప్పేదంతా ఒట్టిఅబద్ధం"

చిన్నమ్మ:— "అబద్ధంగాదు నిజమే. అబద్ధాల కోరువు నువ్వు ప్రపంచంలో అందరూ సత్యహరిశ్చంద్రుళ్లే! నీపేరు బయట పడ్డదిగా! మీనాయనకూడా ఉద్యోగం జేస్తూనాలుగు రాళ్లు సంపాదిస్తుంటే నలుగురూ ఆయన్ను మంచివాడనేవాళ్ళు, నీవు కూడా మంచివాడివయేవాడివి, ఇప్పుడు నువ్వే అబద్ధాల కోరువి, ఎవరి అదృష్టంలో మిఠాయిరాసిపెట్టి వున్నదో వాడు మిఠాయితిన్నాడు. నీముఖం మీద దెబ్బలుతినమనే రాసి పెట్టివున్నది.

ఈ మాటలంటూ చిన్నమ్మ హాల్ ధర్ కట్లు విప్పేసి చెయ్యిపట్టుకొని లోపలికి తీసుక పోయింది. నావిషయంలో, తెలివిగల ఆలోచనచేసి మంచిగా మాట్లాడి అమ్మ విషయాన్ని తిరగేసింది. లేకపోతే పాపం ఎన్ని దెబ్బలు యింకా ఎక్కువగా తినేవాడో! అమ్మదగ్గరకూర్చొని నేను నానిర్దోషిత్వాన్ని బాగానచ్చజెప్పాను. నామంచి అమ్మ నన్ను మూర్తీభవించిన సత్యవంతుడిగా అనుకుంటుంది. తప్పంతా హాల్ ధర్ దేనని ఆమెకు పూర్తినమ్మకం కలిగిపోయింది. ఒక్కక్షణం తరువాత నేను శనగపప్పు, బెల్లంతింటూ ఇంటిబయటికి వచ్చాను. అదే సమయానికి హాల్ ధర్ కూడా అటుకులు తింటూవచ్చాడు. ఇద్దరం కలిసి బయటికి వచ్చాము. జరిగిపోయిన మా అనుభవాన్ని గురించి చెప్పుకున్నాము. నాకథ సుఖమయమయినది. హాల్ ధర్

కథ దుఃఖమయమయినది. అయినా చివరకు యిద్దరిదీ ఒకటే - శనగపప్పు - బెల్లం.



# "కైలాసం గుడ్డ".

గుడిసెవాకిట్లో ఆరిపోయిన దీపంముందు తండ్రీ కొడుకు లిద్దరూ మాట్లాడకుండా కూర్చొని వున్నారు. లోపల కుమారుడి, యవ్వనంలోవున్న భార్య బుధియా ప్రసవవేదనతో బాధపడు తున్నది. ఉండి వుండి వచ్చే హృదయవిదారకమైన రోదనాన్ని విని యిద్దరూ హృదయం చెదిరిపోకుండా పట్టుకొని కూర్చున్నారు. చలిరాత్రులు ప్రకృతి నిశ్శబ్దంగావున్నది. గ్రామమంతా గాఢాంధ కారంలో మునిగిపోయివున్నది.

'ఘీసు' అన్నాడు - "బ్రతికేట్లుగాలేదు. రోజంతా పరుగెత్తిపోయింది. పో చూచిరా".

మాధవుడు గోపంతో "చచ్చిపోయేట్టుంటే త్వరగా ఎందుకు చనిపోదు ? చూసి చేసేదేమున్నది ?" అన్నాడు.

"నీవు చాలా నిర్దయుడివిరా ! సంవత్సరమంతా సుఖ సంతోషాలను ఎవరితో పొందావో దాని విషయంలోనే ఇంత దుర్మార్గమా ?"

"ఆ కాళ్లుచేతులు కొట్టుకోటం నే చూడలేను. ఆ యేడుపు వినలేను".

పంచముల కులం. గ్రామమంతటిలోనూ చెడ్డపేరు. 'ఘీసు' ఒక్కరోజుపనిచేస్తే నాలుగురోజులు విశ్రాంతి తీసుకొంటాడు.

మాధవుడు అరగంటసేపు పనిచేస్తే గంటసేపు గంజాయి దమ్ము పీలుస్తూ కూర్చునే పని దొంగ! అందువల్ల వాళ్లకు ఎక్కడా కూలిదొరకదు. ఇంట్లో గుప్పెడు గింజలుండేసరి. పనిమాట తలవనే తలవరు. ఒకటిరెండు వుపవాసాలయిన తర్వాత ఘీసు పోయి కట్టెలుకొట్టుకొనివస్తే, మాధవుడు వాటిని అమ్ముకొని వస్తాడు. ఆడబ్బు చేతిలోవున్నన్నిరోజులూ యిష్టమొచ్చినట్లు తిరుగుతారు. తిరిగి వుపవాస భయం వచ్చేసరికి కట్టెలు కొట్ట డానికో కూలిపనికో పోతారు. ఊరిలో పనిదొరకని కొరతలేదు. రైతులుండే గ్రామంలో కష్టపడేవానికి యాభై పన్లు దొరుకు తయ్. ఇద్దరుమనుషులు ఒక్కమనిషి చేసేంతటి పనికూడా చేయ కుండావున్నా, సంతోషించాల్సినంతటి అవసరంగల్గినరోజే వాళ్లని ఎవరైనా కూలికిపిలుస్తారు. ఇద్దరూ సన్యాసులైనట్లయితే ధైర్య స్థైర్యాలకోసం సంయమ నియమాలను అనుసరించేవారు. అది వాళ్ల ప్రకృతి. వీరిది అతి విచిత్రజీవితం. ఇంటిలో రెండుమూడు మట్టికుండలను మించిన ఆస్తిపాస్తులులేవు. చినిగిపోయిన గుడ్డలతో, జీర్ణించిన శరీరాన్ని కనిపించకుండా చేసుకొంటూ జీవిస్తున్నారు. ప్రాపంచిక వ్యవహారాలతో సంబంధంలేనట్లుగా. అప్పులు పాముల్లా బుసలు కొట్టుతుంటయ్. తిట్లు తింటారు. తన్నులు తింటారు. ఏవిధమైన దుఃఖమూలేదు. అప్పయిస్తే డబ్బు తిరిగిరాదని గట్టిగా తెలిసివుండికూడా గ్రామస్థులు వారికి అప్పుబెడుతూ వుండే వారు. అంతటి హీనస్థితి వారిది. బటాణీలు, ఉర్లగడ్డలు, ఇతరుల పొలాల్లోనుంచి పీక్కొచ్చుకుని వుడకేసి తింటారు. లేకపోతే ఎవరి చెఱుకుతోటకైనాపోయి పది పదిహేను చెఱుకుగడలు

విరుచుకొచ్చి రాత్రికి రసంపీలుస్తా పడుకొంటూరు. ఫీసు యిదే అవకాశవృత్తితో డెబ్బై సంవత్సరాలు జీవితాన్ని తోసుకొని వచ్చాడు. ఫీసు సుపుత్రుడు మాధవుడు తండ్రిగారి అడుగు జాడల్లోనే తు. చ. తప్పకుండా నిజమైన పితృభక్తి పరా యణుడిలా తయారయ్యాడు. కుమారుడిద్వారా తండ్రి గౌరవ ప్రశస్తులకు మరికొంత ప్రకాశంగలిగింది. ఈ సమయంలో ఇద్దరూ గుడిసెవాకిట్లో కూర్చుని ఎవరిచేనులోనుంచో త్రవ్వకొచ్చిన ఉర్ల గడ్డలు ఉడకేస్తున్నారు. ఫీసుభార్య పరలోకంచేరి చాలా రోజులయింది. మాధవుడి పెళ్లి పోయిన సంవత్సరమే జరిగింది. కోడలు రాగానే తండ్రీ కొడుకులపని మరీ సులభమైపోయింది. ఆమె ఎవరియింటిదగ్గరైనా అంట్లుతోమో లేక గడ్డి దోక్కొచ్చో అమ్ముకొని ఒక శేరుపిండి సంపాదించుకొనివచ్చేది. దాంతో వీళ్లిద్దరి కడుపులుకూడా నిండుతున్నాయ్. ఆమె వచ్చింది. వారిద్దరి విశ్రాంతికాలం హెచ్చింది. ఇద్దరూ మరింతసోమరులు అయిపోయారు. కొంత తిరస్కారభావంకూడా వాళ్లలో ప్రవే శించింది. కూలికిరమ్మని ఎవరైనా పిలువనొస్తే రెండితల కూలి గావాలని అడిగేవారు అలక్ష్యంగా. అదే స్త్రీ యిప్పుడు ప్రసవ వేదనతో చచ్చిపోతున్నది. వాళ్లిద్దరూ ఎప్పుడుచస్తుందిరా! హాయిగా నిదురపోవచ్చు! అని ఆమె చావుకోసం ఎదురు చూస్తూన్నారు.

ఫీసు ఉర్లగడ్డలుతీసి పొట్టుతీస్తూఅన్నాడు. "పోయిచూడు. ఏస్థితిలోవున్నదో? డబ్బు వదిలించుకోవాల్సి వుంటుంది. మరే ముండదు. ఇక్కడ ఏమీ తెలియనివాడుకూడా మందివ్వటానికి

రూపాయి అడుగుతాడు !" తానుగుడిసెలోపలికిపోతే షీసు వుర్ల గడ్డలు ఖాళీచేస్తాడని కొడుకు మాధవునికిభయం. అక్కడికి పోవటానికి నాకు భయంగావున్నది అన్నాడు.

"భయం ఎందుకురా? నేనిక్కడ వుండ నేవున్నానుగా!"

"అయితే నీవే పోయిచూడరాదూ!"

" నాభార్యచనిపోయినపుడు నేను మూడు రోజులు దానిదగ్గరనుంచి కదలకుండా కూర్చున్నాను. బుధియా సిగ్గు పడదూ? ఎవరిముఖంకూడా చూడలేదో ఆవిడ నగ్న శరీరం యీరోజుచూచేదా? దానికి ఒళ్లుకూడా తెలిసిన స్థితిలోవుండదు. నన్నుచూచి కాళ్లూచేతులు సర్దుకోను కూడా సర్దుకోలేదు."

"పిల్లాడో, పిల్లోపు డ్తే ఏంగాను? శొంఠి, బెల్లం, నూనె అన్నీకావాలే - అని నా ఆలోచన. ఇంట్లో ఒక్కటికూడాలేదు!"

"అన్నివ స్తయ్. భగవంతుడి స్తే".

"ఈవాళ అడిగినా ఒక్కదమ్మిడి కూడా యివ్వని వాళ్లు రేపు పిలిచి రూపాయలిస్తారు. నాకు తొమ్మిది మంది సంతానం ఇంట్లోఎప్పుడూ ఏమీవుండేది కాదు. కాని భగవంతుడు ఏదో విధంగానావను ఒడ్డుకు త్రోశాడు."

ఏసమాజంలో రాత్రింబవళ్లు కష్టపడి పనిచేసేరై తుల అధీనంలోని వారు, రై తులలోని లోపాలద్వారా డబ్బుసంపా

యించే వారికంటే సుఖకర జీవితాన్ని అనుభవించలేక పోతున్నారో — ఆసమాజంలోని వీరిలో యిటువంటి మనోవృత్తి ప్రబలి పోవటం ఆశ్చర్యమేమీకాదు. ఫీను రైతులకంటే ఎంతో ఎక్కువ ఆలోచన గలవాడు. వారిఆధీనంలో చేరిన నానాబాధలు అనుభవించేకంటే వారితో చేరకుండా బాధపడుటయే మంచిదని సోమరి పోతుల కుటిల సమాజంలో సభ్యుడయినాడు. అవును. సోమరి పోతుల కుటిలసమాజపు నీతి నియమాలను పాటించగల శక్తిలేదు. అందువల్ల కుటిలసమాజంలోని వారి నందరిని వ్రేలు బెట్టి వారిలోని ప్రతిఒక్కరూ చూపిస్తారు. ఇంత హీనస్థితిలోవున్నా, రైతుల దగ్గర చచ్చేచాకిరీ నుండి తప్పించుకోకలిగాము కదా అనే సంతృప్తివారిలోవున్నది. వారు మృదువుగా ఉదారంగా ఉన్నందు వల్ల ఇతరులకు సంతృప్తిగాని, సంతోషంగాని కలిగేది లేదు.

ఇద్దరూ ఉర్లగడ్డలు ఒలుచుకొని వేడివేడిగా తినటం ప్రారంభించారు. నిన్నటినుంచి తినలేదు. అవి చల్లారేంతవరకూ వేచివుండే ఓపిక వారిలోలేదు. ఎన్నోసార్లు ఇద్దరి నాలుకలు కాలిపోయినయ్. పొట్టుతీసిన తర్వాత ఉర్లగడ్డల పై భాగం వేడిగా తెలియదు. పంటిక్రిందబడి నమిలిన తర్వాతగాని దాని వేడి తెలియదు. నాలుక, గొంతు, అంగిలి అన్నీ కాలిపోతుంటయ్. ఆ స్థితిలో వాటిని నోట్లోవుంచుకోటంకంటే మ్రింగేయటమే ఆరోగ్యకరం. అక్కడ వాటిని చల్లబరచటానికి కావల్సిన సామాగ్రంతా వున్నది. అందువల్ల యిద్దరూ త్వరత్వరగా మ్రింగేస్తున్నారు. ఈ ప్రయత్నంలో యిద్దరి కళ్ల వెంటా నీరుకారుతున్నది.

ఇంతలో ఘీసుకు ఇరవై సంవత్సరాల క్రితం తను పోయిన జమీాందారుగారి పెళ్లి విషయం జ్ఞాపక మొచ్చింది. ఆ విందులో అతడికి కలిగిన తృప్తి అతడి జీవితంలో మొదటి, యింతవరకూ చివరి, మధుర ఘట్టం. దానిని యింతవరకూ జ్ఞాపకం పెట్టుకొని వుండదగి వున్నది. 'ఇంతవరకూ అది క్రొత్తగానే వున్నది.' అన్నాడు — "ఆరోజు భోజనం మరపురాదు. అప్పటినుంచీ మళ్లా అటువంటి కడుపునిండు భోజనం ఇంతవరకూ ఎరుగను. ఆడపిల్లవాళ్లు అందరికీ కడుపునిండా పూరీలిచ్చారు అందరికీ! చిన్న పెద్దలు, అందరూ పూరీలుతిన్నారు. సిసలైన నేతితో తయారయినవి! పచ్చడి, కూర, మూాడురకాల పాయసాలు, మంచిరుచిగల కూర, పెరుగు, నెయ్యి — అబ్బ! ఆనాటి వాటి రుచి యీానాడు ఏమని చెప్పేది! ఏ విధమైన అడ్డూ ఆటంకమూ లేదు. ఏంకావాలో అడుగు. ఏంతింటావో తిను. అందరూ ఎంత తిన్నారంటే — ఎంత తిన్నారంటే — నీళ్లు త్రాగేందుకు కూడా సందులేకుండా తిన్నారు. వంటవాళ్లు ఆకులలో వేడివేడి సువాసన వుండలను వేసేవాళ్లు. అక్కరలేదని ఆకుకు అడ్డంగా చేతులు పెట్టినా వాళ్లు వినలేదు. అడిగినా అడక్కపోయినా వేసిపోవటమే వాళ్లపని. అందరూ మూతికడుక్కున్న తర్వాత ఆకులు - వక్కలు కూడా యిచ్చారు. అయితే నాకు ఆకులు తీసుకొనేంతటి ఓపిక ఎక్కడున్నది? నుంచోటానికే వీలులేకుండా వున్నది. వెంటనే పోయి గొంగడిమీాద పడిపోయాను. ఎంత ఉదారుడు ఆ జమీాందారు? అహ!"

మాధవ్ యీ పదార్థాల పేర్లనువింటూ వాటిని మనసు లోనే తింటున్నాడు — "ఇప్పుడు మనకటువంటి భోజనం ఎవరూ పెట్టరా?" అన్నాడు.

"ఇప్పుడెవడు పెట్టుతాడు? ఆకాలంవేరు ఇప్పుడందర్నీ పిసినారితనం పట్టుకొన్నది. పెళ్ళిలో ఎక్కువ ఖర్చుపెట్టవద్దు - వంటలు, భోజనాలకు అసలు ఖర్చుపెట్టవద్దు అని చస్తున్నారు. బీదవాళ్ల డబ్బంతా ఎక్కడ దాచిపెట్టుతున్నారు? అని అడుగు! దాచిపెట్టడంలో తక్కువేంలేదు. ఆఁ! ఖర్చుపెట్టడంలో మాత్రం అందరూ మొండిచేతులవాళ్లే."

"నీవు యిరవై పూరీలైనా తినివుంటావు?"

"ఇరవై కంటే ఎక్కువే యీడ్చేశాను!

"నేను యాభై తింటాను!"

"యాభై కంటే నేనుకూడా తక్కువతినలేదు. మంచిపిండి. నీవునాలో నగంకూడాలేవు."

ఇద్దరూ ఉర్లగడ్డలు తిని కాసిని నీళ్లు త్రాగారు. ఆ వాకిటి లోనే పంచలు కప్పుకొని కడుపులో కాళ్లుపెట్టుకొని పడుకున్నారు. పెద్దపెద్ద అజగరాల లాగావున్నారు.

బుధియా యింకా మూలుగుతూనే వున్నది.

ఉదయమే మాధవుడు గుడిసెలోకి పోయిచూస్తే ఆతడి భార్య కొయ్యబారిపోయి పడివున్నది. ఆమే ముఖంమీద దోమలు ముసురుతున్నయ్. అలసిపోయిన గ్రుడ్లు పైకిచూస్తు న్నయ్. శరీరమంతా దుమ్ముతో నిండిపోయి వున్నది. ఆమె గర్భంలో పిల్లవాడు మరణించాడు.

పరుగెత్తుతూ మాధవ్ ఘీసుదగ్గర కొచ్చాడు. ఇద్దరూ అయ్యో! అయ్యో! అని అరుస్తూ రొమ్ములు గ్రుద్దుకుంటూ యేడవటం ప్రారంభించారు. ఇరుగు పొరుగువాళ్ళు యీ యేడు పులు విని పరుగెత్తివచ్చారు. పాత ఆచారం ప్రకారం వాళ్లని ఓదార్చటం ప్రారంభించారు. ఎక్కువగా ఏడవాల్సిన అవసరం లేదు. కట్టెలు, కైలాసంగుడ్డ సంపాదించాలి. పెద్దపులి గుహలో మాంసంలాగా వీళ్ళ గుడిసెలో డబ్బు నామానికూడా లేక పోయింది.

తండ్రీ కొడుకులు ఏడుస్తూ వూరిలోని జమీందారు యింటికి వెళ్లారు. ఆయన వీళ్లిద్దరంటేనే మండిపడుతాడు. దొంగ తనం చేసినందుకు, మాటయిచ్చి పనిలోకి రానందుకు, ఆయన వీళ్లను ఎన్నోసార్లు వీపు చినిగిపోయేటట్లు కొట్టాడు. "యేంరా ఘీసూ! ఏడుస్తావెందుకు? ఈ మధ్య నీవెక్కడా కన్పించటంగూడా లేదు! నీకు యీ వూళ్లో వుండటంగూడా యిష్టం లేనట్లున్నది." అని అడిగాడు.

ఘోసు నేలమీద తలమోపి కళ్లల్లో నీళ్లునింపుకొని "దొరా! పెద్ద ఆపదలోవున్నాను. మాధవుడి యింటిది రాత్రి దాటిపోయింది. రాత్రంతా బాధపడ్డది దొరా! ఇద్దరం దాని తలదగ్గర కూర్చొనివున్నాం. మందూ - మాకులూ - యేం చెయ్యాలో అన్ని చేశాము. చివరికి మమ్మల్ని మోసంచేసి పోయింది. ఇక రొట్టెముక్క చేసిపెట్టే దిక్కుకూడా లేకుండా పోయింది దొరా! ఘోరంజరిగిపోయింది. ఇల్లు కూలిపోయింది. మీదాసుణ్ణి. మీరుదప్ప దాన్ని మట్టిజేసేవాళ్లెవరు? మా చేతుల్లో వున్నదంతా మందూ - మాకుల కయిపోయింది. ప్రభువుల దయవుంటేనే దానిమీద అంత మట్టిపడుతుంది. మీకు తప్ప మరెవరి గడపముందుకు పోయినా లాభముండదు' అన్నాడు.

జమీందారుగారు కొంత దయగలవాడు. కాని ఘోసుమీద దయచూపటమంటె నల్లగొంగడికి రంగుపూయటం. మనసులో "ఛా! వెళ్లవతలికి!" అనేద్దామని వుందిగాని ప్రయత్నించినా ఆ మాటలు రావటంలేదు. ఇంతకుముందు కనిపించనివాడు అవసరంవచ్చిపడ్డది కనుక వచ్చాడు. మోసగాడు! వెధవ! కాని యిది దండించాల్సిన, కోపించాల్సిన, సమయంకాదు. లోలోపల మండిపడుతూ రెండు రూపాయలు విసిరి పారేశాడు. ఓదార్పు మాట ఒక్కటికూడా నోటివెంటరాలేదు. వాళ్ల వంకచూడను గూడా లేదు. వాళ్లు పోవటం తలమీద బరువుతీసినట్లున్నది.

జమీందారుగారే రెండు రూపాయలిచ్చినపుడు గ్రామం లోని యితరవ్యాపారులు, పెద్దమనుషులు లేదని ఎట్లా చెప్ప

గలరు ? ఫీసు జమీందారుగారికిపేరు చాటింపువేయటంకూడా ఎరిగున్నాడు. కొందరు రెండణాలు, కొందరు నాలుగణాలు యిచ్చారు. ఒక్క గంటలో ఫీసు చేతిలో ఐదురూపాయలగట్టి సొమ్ము చేరిపోయింది. ఎవరో వెదుళ్లిచ్చారు. కొందరు కట్టెలిచ్చారు. మధ్యాహ్నానికి ఫీసు, మాధవ్, ఇద్దరూ, బజార్లో కైలాసంగుడ్డ కొనుక్కు రాబోయారు. ఇక్కడ చేరినజనం వెదుళ్లు చీలుస్తున్నారు.

వూరిలోని సున్నితమయిన హృదయంగల స్త్రీలువచ్చి, శవాన్ని చూచి, చచ్చినామె దురదృష్టాన్ని దూషిస్తూ నాలుగు కన్నీటికణాలు రాల్చిపోతున్నారు.

"బజారు చేరిం తరువాత ఫీసు అన్నాడు — "దాన్ని బూడిద చేయటానికి సరిపోయేకట్టెలుదొరికినయ్! కదూమాధవ్"

"అవును కట్టెలుచాలావున్నయ్. ఇప్పుడు కైలాసం గుడ్డకావాలి." అన్నాడు మాధవ్.

"అయితే పదయేదో చౌకరకం గుడ్డ చూద్దాం." "ఆఁ! కాకపోతే! శవం లేచేసరికి రాత్రయిపోతుంది. చీకట్లో గుడ్డ మంచి చెడ్డలు ఎవరు చూస్తారు?"

"ఎంత చెడ్డ ఆచారం! బ్రతికి వుండగా కట్టుకోను చినిగినపేలిక కూడా దొరకని దానికి చచ్చిన తర్వాత క్రొత్త గుడ్డ!"

"కై లాసం గుడ్డ ఆ శవంతో పాటు కాలిపోతుందిగా!"

"లేకపోతే మిగిలివుంటుందా? ఈ ఐదు రూపాయలే ముందుగా దొరకితే ఏమందో మాకో యిచ్చేవాళ్లం!"

ఒకడు మరొకడితో మనసులోని మాటచెబుతున్నాడు. బజారులో ఇటూ అటూతిరుగుతూవున్నారు. ఒకసారి కుడివైపు దుకాణంలోకి పోతే రెండోసారి ఎడమవైపు దుకాణం మెట్లు దిగివస్తారు. రకరకాలయిన గుడ్డలు - పట్టువి - దూదివి - చూచారు. యేదీనచ్చలేదు. సాయంకాల మయిపోయింది యీ విధంగానే తరువాత యిద్దరూ ఏదో దైవప్రేరణవల్ల పోయినట్లు ఒకసారాయి దుకాణం ముందుకు చేరారు. ఏదో తాము యింతకు ముందుగనే నిర్ణయించుకొన్న వారిలాగా లోపలికిపోయారు. ఏమీతోచక కొంతసేపు నిల్చున్నారు. దరువాత ఘీసు ముందుకు పోయి — "నాకూ ఒక సీసా యివ్వవయ్యా!" అన్నాడు.

ఇంతలో కొన్ని కోడిపెట్టలు — కొన్ని ఎండుచేపలు వచ్చినయ్. ఇద్దరూ వరండాలో కూర్చొని ప్రశాంతంగా సారా సేవించటం ప్రారంభించారు. గొంతు దాగా త్రాగిన తర్వాత నిషాలో పడ్డారు.

ఘీసు — "కై లాసం గుడ్డవేస్తే యేమొస్తుంది? చివరికి కాలిపోతుందిగాని కోడలితో కాస్తగూడాపోదుగా!"

మాధవ్ దేవతలలో తన నిర్దోషిత్వానికి సాక్షులుగా వుండండని అడుగు తున్నట్లుగా ఆకాశంచూస్తూ అన్నాడు —

"మానవనిర్మితం - కాదు - అందరూ బ్రాహ్మణులకు వేలకొద్దీ రూపాయ లెందుకిస్తారు? పరలోకంలో దొరికేది దొరకంది ఎవరుచూశారు."

"గొప్పవారిదగ్గర డబ్బున్నది. ఖర్చుపెడుతారు! మనదగ్గరేముంది? అయినా జనానికి సమాధానం ఏమని చెబుతావు? కైలాసంగుడ్డ ఎక్కడనిఅడిగితే ఏమంటావు?"

ఘీసునవ్వాడు – "అరే! డబ్బుబొక్కొంచి జారిపోయింది. ఎంతవెదకినా దొరకలేదు. అని చెబుదాము వాళ్లునమ్మరు. అయినా వాళ్లేమళ్లాడబ్బిస్తారు".

కోరకుండానే సిరితమ్ము వలసినందుకు మాధవ్ నవ్వుకున్నాడు – "చాలామంచిది పాపం! చచ్చినా బాగాతినిపించి తాగిస్తున్నది." అన్నాడు.

సగం సీసాకుపైగా అయిపోయింది. ఘీసు రెండుశేర్ల పూరీలు తెప్పించాడు. పచ్చడి-గుండెకాయలు-మాంసపుముక్కలు సారాయి దుకాణంముందే పూరీల అంగడి. మాధవ్ పరుగెత్తిపోయి రెండాకులలో సామానుతా తెచ్చాడు. రెండున్నర రూపాయిలు పూర్తిగా అయిపోయినయ్. ఇంకా కొన్ని చిల్లర డబ్బులు మిగిలి వున్నయ్.

అరణ్యంలో ఆకలితోవున్న పెద్దపులి లేడి పిల్లను వేటాడి తినేంతటి ఆతృతతో ఇద్దరూకూచొని పూరీలు తింటున్నారు. ఊరివాళ్లకు సమాధానం చెప్పాలనే అభిప్రాయమూలేదు –

చేష్టపోొస్తుందనే భయమూలేదు. ఈరెంటినీ వాళ్లెప్పుడో ఇంతకు ముందుగానే జయించారు.

ఫీసు వేదాంతం చెప్పాడు — "మన ఆత్మ సంతృప్తి చెందితే దానికి పుణ్యంరాదా?".

మాధవ్ ఎంతో నమ్రతతో తండ్రి సిద్ధాంతాన్ని బల పరిచాడు — "తప్పకుండా వస్తుంది! తప్పకుండా! భగవంతుడా! నీవు సర్వాంతర్యామివి. దాన్ని స్వర్గానికి తీసుకపో! మేమిద్దరం హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాం ఈరోజు దొరికిన భోజనం జీవితంలో యేనాడూ దొరుకలేదు.

ఒకక్షణం పోయిన తరువాత మాధవ్‌కు ఒక సందేహ మొచ్చింది — "సరేనాన్నా! ఏదోఒక రోజున మనంగూడా అక్కడికి పోతాంగదూ?" అని అడిగాడు.

ఫీసు ఆ అమాయక ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. అతడు పరలోకసంబంధ విషయాలతో ఆ క్షణంలోవున్న ఆనం దానికి అంతరాయం కలిగించుకో దలచుకోలేదు.

"అక్కడివాళ్ళు మీరు కైలాసంగుడ్డ ఎందుకు వేయలేదని అప్పుడడిగితే యేమని చెబుతాము?".

"నీ తలకాయందాము! దానికి కైలాసంగుడ్డ దొరకదని నీకెట్లా తెలుసును? డెబ్బయి సంవత్సరాలు, నేనేం గడ్డిదోకు

పూడుచున్నా ననుకున్నావా? దానికి కైలాసంగుడ్ల దొరుకుతుంది. మనమేసేదానికంటే మంచిదేదొరుకుతుంది తప్పకుండా!"

మాధవ్‌కు నమ్మకం కుదరలేదు. "ఎవరిస్తారు? చిటికలో డబ్బంతా ఖర్చుబెట్టేశావు. అది సన్నమగుతుంది. దానికి తాళి గట్టింది నేనేగా?" అన్నాడు.

ఫ్రీసుకు కోపంవచ్చింది - "దానికి కైలాసంగుడ్ల దొరుకుతుంది. అంటున్నాను. నీ వెందుకు నమ్మవు?" అన్నాడు "ఎవరిస్తారో ఎందుకు చెప్పవు?

"ఇప్పుడెవరిచ్చారో వాళ్లే యిస్తారు. ఆఁ! ఇప్పటిడబ్బు మనచేతుల్లోకి తిరిగివస్తుందా?"

చీకటిపడిన కొద్ది నక్షత్రాలవెలుగు ఎక్కువవుతుంది. మధుశాలలో గోలగూడా ఎక్కువకావటం ప్రారంభమయింది. ఎవడో పాడుతాడు - ఎవడో తాళంవేస్తాడు-ఇంకొకడు తన స్నేహితుడిని కౌగిలించుకుంటాడు - మరొకడు తన ప్రక్కనవున్నవాడి ముఖానికి బొట్టుపెడుతాడు. అక్కడి వాతావరణం మత్తుతో నిండి పోయింది. అక్కడిగాలిలో 'నిషా' వున్నది. ఎంతోమంది యిక్కడికివచ్చి చిటికెలో మత్తెక్కిపోతారు. సారాయికంటె యిక్కడిగాలి వారికి ఎక్కువ నిషా కలిగిస్తుంది. జీవితంలోని బాధలు వారి నిక్కడికి యీడ్చుకొని వస్తయ్. కొద్ది సేపటి వరకు వాటిని మరచిపోతారు. తాము జీవులో - విగతజీవులో మరచిపోతారు. లేకపోతే - ఇటు జీవించరు - అటు మరణించరు.

తండ్రీ కొడుకులిద్దరూ ఇంకా మత్తులో సంతోషాన్ని అనుభవిస్తూనే వున్నారు. అందరికళ్లూ వీళ్లిద్దరిమీదే కేంద్రీకరించబడినయ్. ఇద్దరూ అదృష్టపు ముద్దుబిడ్డలు ! ప్రాప్తి సీసా వాళ్ల ముందున్నది.

కడుపునిండిన తరువాత మిగిలిన పూరీలను మాధవ్, ఆకలికళ్లతో తదేకంగా తమ వంకచూస్తూన్న అడుక్కుతినే వాడికి యిచ్చేశాడు - "ఇచ్చే" గౌరవాన్ని, ఆనందాన్ని, ఉల్లాసాన్ని, తన జీవితంలో మొట్టమొదటిసారి అనుభవించాడు.

ఘీసు:— "తీసుకపో ! బాగాతిని ఆశీర్వదించు. ఎవరు సంపాదించారో అది చచ్చిపోయింది. కాని నీ ఆశీర్వాదందాని దగ్గరకు తప్పకుండా చేరుతుంది. రోమ రోమంతోనూ ఆశీర్వదించు. అతి కష్టంమీద సంపాదించిన డబ్బిది !" అన్నాడు.

మాధవ్ తిరిగి ఆకాశంచూస్తూ అన్నాడు —— "అది వైకుంఠానికి పోతుంది నాన్నా! వైకుంఠానికి రాణి అవుతుంది."

ఘీసునుంచున్నాడు. ఉల్లాసతరంగాలలో యీదుతున్నట్లుగా అన్నాడు —— "అవునురా ! వైకుంఠానికి పోతుంది. ఎవరినీ పీడించలేదు. ఎవరినీ ఒత్తిడిచేయలేదు. చనిపోతూ చని పోతూ మనజీవితంలోని గొప్ప కోరికను చెల్లించిపోయింది. వైకుంఠానికి అదిపోకపోతే —— రెండుచేతులతో బీదవాళ్లను దోచుకుంటూ, గుళ్లుకట్టించి, చేసిన పాపాన్ని గంగాజలంతో కడుక్కోవాలని తాపత్రయపడే, లావుపాటి పెద్దమనుష్యులు పోతారా?"

పర్పడిన శ్రద్ధవెంటనే, రంగుమార్చింది. అస్థిరత్వం మత్తు యొక్కమూలస్థానం. దుఃఖం నిరాశ, చుట్టుముట్టినయ్.

మాధవ్ — "అయినా పాపం! జీవితంలో చాలా దుఃఖాలను - నుభవించింది. ఎంత కష్టాన్ననుభవించి చని పోయింది?" అన్నాడు.

అతడు కళ్లుచేతులతో కప్పుకొని యేడవటం ప్రారంభించాడు. వెక్కి వెక్కి యేడుస్తున్నాడు. ఫేఁసు ఓదార్చాడు — యేడవటం ఎందుకురా? అది యీ మాయాజాలంలోంచి ముక్తిని పొందినందుకు — యీ కష్టాలన్నిటినీ వదలి సుఖలోకానికి పోయినందుకు — సంతోషించు. చాలా అదృష్టవంతురాలు! ఇంతత్వరలోనే మాయా మోహాలనుండి విముక్తిని పొందింది."

ఇద్దరూ నుంచుని పాడటం మొదలు బెట్టారు —

"మాయాజాలమురా! మమతలలో పడబోకుమురా!" త్రాగు బోతుల చూపులన్నీ వీరిమీదనే కేంద్రీకరించ బడినయ్. తనివిదీర ఇద్దరూ పాడుతున్నారు. నాట్యంచేయటం ప్రారంభించారు. ఎగిరారు - గంతులేశారు - పడ్డారు - దొర్లారు. భావాన్ని విప్పిచెప్పారు. అభినయం చేశారు. చిట్టచివరకు పూర్తిగా ఒళ్ళు మరచి పోయి అక్కడే పడిపోయారు.

---